


# అభినవసరస్వతి

| సంపుటము | ధాతృనామ సంవత్సరము | |
|---|---|---|
| ౨౮ | శ్రావణమాసము | ౫ |

## —* కృతివిమర్శము *—

రాధామాధవము — రాధామాధవబిరుదాంకితుఁడగు చింతలపూడి యెల్లనార్యునిచేఁ బ్రణీతము. తూర్పుగోదావరిజిల్లా కపిలేశ్వరపురము జమీందారులగు బలుసు బుచ్చిసర్వారాయఁడు బహదరుగారు దీనిఁ బ్రకటించిరి దీని వెల రు 1-8-0 కృష్ణభగవానునకును రాధకును జరిగిన స్వయంవరవివాహమహోత్సవ మిందు వర్ణితము.

సీ. శ్రీవత్సలాంఛన శ్రీముఖాంబుజమున
శ్రీవత్సముని కులశేఖరుండు
ప్రభవించె. ఆమహాభాగు వంశాంబుధి
దివ్యరత్నంబుల తెఱఁగుమీఱి
పుట్టి రనేకులు పురుషార్థపరులైన
వారు వారలలోన వంశకర్త
వర్ణితసత్కీర్తి వల్లభుఁ డొప్పారె.
అతనికి శ్రీకృష్ణుఁ డవతరించె
అతనియందుఁ గౌమనార్యుండు జన్మించె.
అతని కేను లచ్చమాఖ్యయందు
జననమైతి నెల్లసత్కవిచంద్రుండ
సరసహితచకోరసఖ్య మలర.

అనుపద్యమునుబట్టి యీయన కులగోత్రాదు లెఱుంగనగు. ఈకృతి యాశ్వాసాంతగద్యములోని కౌముదపభుసుపుత్రయను విశేషణమువలన నీయన పితృపితామహాదులు చింతలపూడిగ్రామాధికారులై యుండవచ్చునని తోఁచెడిని చింతలపూడిలోని యునికిచేతనే యింటిపేరుగూడఁ జింతలపూడివారని గ్రామనామమే యేర్పడి యుండఁబోలు. ఇతఁ డీరాధామాధవమే కాక విష్ణుమాయానాటకమను మఱియొక ప్రబంధమును రచించుచు దానిఁగూడఁ దనయిష్టదైవమగు మదనగోపాలమూర్తికిఁ గృతియిచ్చినట్లు తెలియనయ్యెడిని. ఈకవి కృష్ణదేవరాయల కాలపువాఁడు. కనుక నే

యప్పటి మనువసుచరిత్రాదులలోని పాకముతో నీగ్రంథము రచింపఁబడినది. అప్పటి పింగళిసూరన ప్రభావతీప్రద్యుమ్నముయొక్కయు నీరాధామాధవముయొక్కయుఁ గథాసంవిధానము సమానమై కనుపట్టెడిని. రాధ కృష్ణునకు మేనత్తయో యెవరో పరకీయయనియు వారే యన్యోన్యానురాగములతో నైక్యమైరనియు ననేకు లభివర్ణించి యనేకగ్రంథములు రచించి గోపాలకృష్ణుని గోపికాజారునితోపాటు రాధికాజారుని జేసివైచిరి భాగవతాదులయందు రాధ పేరే లేదు కాని గర్గసంహితలో మూర్తిత్రయమునకును మూలపురుషుఁడైన శ్రీకృష్ణునకు రాధ నిత్యానపాయినియైన పరాశక్తియనియు నివాసము గోలోకమనియు వారొక కారణమున భూలోకమం దవతరించి భార్యాభర్తలైరనియుఁ జెప్పఁబడియున్నది.

వృషభానుఁడను పేరు సహస్రగోపుఁడని మార్చినను గడమ కథాభాగము గర్గసంహితోక్తప్రకారమే యిందుఁ గల్పింపఁబడినది. రాధ సౌందర్యము శృంగార రసభూయిష్ఠముగా నతిప్రౌఢముగా ననేకపద్యములలో నభివర్ణితము స్వకవిత్వము చాల సారవంతమగుటచే సరసు లెల్లను జదివి శ్లాఘింతురని యీకవి

చం. సరసులు చిత్తగింపుఁడని చాటను. మామకవాణి సన్మనో
హర యగునేని వారిహృదయంబుల కింపొనరింపకున్నె? ఎ
వ్వరు పిలువంగవచ్చి యళివర్గము లాత్మలఁ జొక్కుఁ దేనియల్
కురియు ప్రసూనగుచ్ఛభరకుంచిత మల్లిమతల్లికావనిన్?

అని ధైర్యముతోఁ జెప్పికొన్నవాఁడు ఈయన కవన మెంతయుఁ బ్రౌఢము శృంగారరసప్రధానమునే కాక,

శా. నీనామామృతవీచికల్ చెవులకున్ విందయ్యె. నీరూపతే
జోనీరేజమునందుఁ దృఙ్మధుపముల్ శోభిల్లె నీసత్కృపా
శ్రీనిండారిన మానసంబు దనిసెన్ సేవింప నీవంటి ని
త్యానందోజ్జ్వలమూర్తియుం గలఁడె కృష్ణా! వల్లవీవల్లభా!

మొదలైనపద్యములలో భక్తిరసభరితమైకూడ భాసిల్లుచున్నయది ఇతఁడు మదనగోపాలకృష్ణునకు మంచిభక్తుఁడని యీతగ్రంథపాఠకు లెల్లరు సెఱుఁగఁగలరు. రుక్మిణీకళ్యాణమును మనస్సున నుంచుకొని కాఁబోలు నిక్కవి రాధకు భద్రకుఁడను భ్రాతయున్నట్లును నతఁడా మెను గృష్ణున కిచ్చుట కిష్టపడక స్వయంవరము చాటించి నట్లును నందు రాధ కృష్ణుని వరించినట్లును దక్కటిరాజప్రముఖు లది సహింపక రాధం గొంపోవ శ్రీకృష్ణునితోఁ బోరి విజితులైనట్లును బదపడి భద్రకుఁడు బరిభవింపఁబడినట్లును గథ కల్పించెను పంచాశ్వాసములును 1172 పద్యములును గలిగి యీ ప్రబంధము పండితకవుల ప్రస్తుతికిఁ బాత్రమైయున్నది. ఇట్టియుద్గ్రంథమును బయటికిఁదీసి ప్రచురపఱచి బలుసు బుచ్చిసర్వారాయఁడుబహదరుగారు పాఠకులకుఁ

బరోపకారముం గావించియున్నారు. వీరి భాషాభిమానము ప్రశంసనీయము. ఇంకను మచ్చున కిందలి దిగువపద్యములు తిలకింతురుగాక.

సీ. వీఁడటే చిటికెనవ్రేలిపై నాలకు
  కొండయెత్తిన సముద్దండభుజుఁడు ?
వీఁడటే వ్రేపల్లె వెన్నదొంగిలి తిన
  మరఁగి వర్తించెడు మాయలాఁడు ?
వీఁడటే కాళియ విపులఫణామండ
  లమున నాడిన కేళిలాసకుండు ?
వీఁడటే చెక్కలువిడఁచి బకాసుర
  విగతాసుఁ జేసిన వీరమూర్తి ?
వీఁడటే కన్నతల్లికి నెలయు జగము
లాననంబునఁ జూపిన యనఘుఁడు ?
వీఁడటే చౌర్యరతిలీల ప్రేమగువల
వాంఛ లొడఁగూర్చ నేర్చిన వన్నెలాఁడు ?

సీ. అత్తమామలు లేని యలినీలవేణులు
  ఉత్సవంబులఁ జూడ నోఁచలుసతులు
వృద్ధనాయకలైన విధుమండలాస్యలు
  పుట్టిండ్లుమఱఁగిన పువ్వుఁబోండ్లు
వరుసలే కెడమైన వనజాయతాక్షులు
  మగఁ డూరలేనిచో మలయుబోఁట్లు
తామె యిల్దీర్చెడి తనుమధ్యలతికలు
  చెఱఁగుమాసిన సరసీజముఖులు
పొరుగునఁ దలఁచు ముచ్చటఁ బ్రొద్దుజరపు
జవ్వనులుఁ జౌర్యరతతంత్రచతురసతులు
జారు నెలయించి కేళికాసారతీర
శైలవనవాటికలఁ గ్రీడసల్పి రెలమి.

పింగళహరికథ — గ్రంథకర్త గాడేపల్లి వీరరాఘవశాస్త్రి శతావధానిగారు. గద్వాలసంస్థానవిద్వత్కవి దీని వెల రు 0-6-0 ఇది రామభక్తిప్రధానమై శ్రోతలకును గాతలకును గడుముదావహమైన కథ. గ్రంథకర్త గద్వాల సీతారామభూపా

లుర కాలమునుండి తదాస్థానమునఁ దగుసన్మానము వడయుచుఁ బ్రకృతము ప్రతిపంథత్సర మాఘమహోత్సవాగతపండితకవులపైఁ బరీక్షాధికారులుగా నియమింపఁబడి ప్రభువుగారిచేఁ బరిపాలింపఁబడుచున్నారు. రాఘవశాస్త్రిగారు సీతారామభూపాలుర యనంతరము కొన్నివత్సరములు హేత్వంతరములచే నేతేరక ప్రమోదూతమాఘమున మరల వచ్చి జ్ఞాపకార్థమై గద్వాలరాణి యాదిలక్ష్మమ్మబహాదరుగారికి

సీ. దైవముదిన్నె యాస్థానంపుఁ గవినైతి.
రామరాయల కవిరత్నమైతి.
గద్వాలతమసభావిద్వత్సుకవినైతి.
తద్జ్ఞులెన్న శతావధానినైతి.
అహరహఃకృతినిర్మితాశుసత్కవినైతి.
ఘటికాశతశ్లోకకర్తనైతి.
ఉభయభాషాకావ్య విభవోన్నతుఁడనైతి.
విదితయజుర్వేదవేత్తనైతి.
సరసమత్కావ్యరచనారసప్రవాహ
మే కరుడుగట్టి చారిక లెసఁగు నిచట.
దూరదృష్టికి నేఁటికిఁ దోఁచుచుండు
కనుగొనఁగదమ్మ రాఘవకవిని నేను.

అని పంపిన విజ్ఞాపన యాయన ప్రతిభం దెలియఁజేసెడిని. పింగళియను పిన్న వేశ్య శ్రీరాముని మోహించి సీతాసమేతుఁడై యంతఃపురమందున్న యాయన యంతికమునకు హనుమంతుని సహాయముతో నరిగి యభిమతంబు దెల్పుకొనుట యద్దాని భక్తికి మెచ్చి యపరజన్మమం దాకోర్కె తీర్తునని యంపుట, మొదలుగాఁగల యంశము లిం దభివర్ణితములు

ఉ. ఆశుకవిత్వపద్యరచనాతిపటిష్ఠవచోవిలాస ది
వ్యాశయుఁడైన యీకవికులాగ్రణి రాఘవశాస్త్రిగారు వా
తాశనవైరివేగ మధురామృతవర్షి మనోజ్ఞకల్పనా
వేశమనస్కుఁడై కృతి నవీనముగా నొనరించె నియ్యెడన్.

అను నుప్పల పిచ్చయ్యకవిగారి పద్య మీశాస్త్రిగారి కవిత్వసౌష్ఠవమును గడుంగడుఁ దెలియఁజేసెడిని.

కుమారోదయము— ఇది సంస్కృతభాషలో వ్రాయఁబడిన చంపూరూప కావ్యప్రబంధము జంధ్యాల భగవచ్ఛాస్త్రులుగారు దీని రచించిరి వీరిది శేపల్లెయొత్తసమీపగ్రామమో యైయున్నది. 40, 50 సం॥ల నాఁడు సికింద్రాబాదు సం

సంస్కృతపాఠశాలలో నుపాధ్యాయులుగా నుండుచు వీరీగ్రంథమును రచించిరి. ఇందు ముఖ్యాంశము కుమారోదయమే యైనను హైదరాబాదు సికిందరాబాదు పట్టణములను సికింద్రాబాదుపట్టణమధ్యమున ముత్యాల రామన్నగారిచే స్థాపింపఁబడిన తాండవేశ్వరవిగ్రహమును దద్దయు వర్ణింపఁబడినవి. తత్తాండవేశ్వర దర్శనార్థ మరుదెంచిన తత్పుర విద్వద్బ్రాహ్మణులు చేసిన ట్లాదిత్యాద్యనేకస్తోత్రములు రచించి శాస్త్రులుగారు స్వవిద్వత్త చాలఁ బ్రకటించిరి. వీరిది యనర్గళమైన సాహిత్యము. సర్గకు సుమారు 60, 70 శ్లోకములతో నీకావ్య మైదుసర్గలలో సమర్పఁబడినది. శృంగారరసప్రధానము కనుకనే మునిపత్నుల నగ్ని మోహించు కథాభాగము తీసికొని శాస్త్రిగారు మిగుల వర్ణించి కొనకుఁ గుమారోదయము తత్పట్టాభిషేకము దేవసేనాపతిత్వము మున్నగువానితో ముగించిరి.

---

## —* తాళ్ళూరు విశ్వమల్లేశ్వరుఁడు *—

ఈమల్లేశ్వరుని గుంటూరుజిల్లా సత్తెనపల్లితాలూకాలోని తాళ్ళూరుపల్లీసతి తన గర్భమున ధరించి బహుకాలమునకుఁగాని ప్రసవింపలేకపోయెను ఇతరస్త్రీలెల్లరును నవమాసములు మోయుచుండ నలువదిసంవత్సరములే యీనాతి మోసినది. కనలేక కనలేక కడుఁ గష్టపడినది గ్రామమధ్యముననే కనఁజూచినది కాని యది కొందఱు కనిష్టమయ్యెను. కడకుఁ గఱకంఠుని గలకాలము కడుపులోనే యుంచఁజూచిరి కాని కొన్నపనకుఁగూడ నిష్టపడకపోయిరి. గర్భమునఁ బడునాఁటికే యాదేవున కెవరో యర్పించిన కాశ్యపి మొదలైనకానుకలు కైవసముఁజేసికొనిరి లింగని కర్పింపఁబడిన లింగమ్మ రెయె 23_13 ట్ల భూమి వెంగలులపాలయ్యెను. అవనిపై నామె పేరు ప్రతిష్ఠ లేకుండ నైపోయెను. ఎల్లకాలము నిట్లు తల్లికడుపులో నుండలేక తల్లడిల్లెడు విశ్వమల్లేశుని వ్యాకరణము వెంకటేశ్వరావధానిగారు వీరియు వారియు సాయముతో వెలుపలికి గుంజిరి. రేకపల్లి సుబ్బారాయుఁడుగారి కుమారుఁడు భాస్కరరావుగారు నిరాకారుఁడగు నామల్లేశ్వరున కాకారము గల్పించిరి. వెంకటేశ్వరావధానిగారే యూరికిఁ బడమట నొకరిచే నొసంగఁబడిన యుత్తమోర్వి నాలయగోపురప్రాకారాదు లన్నియుం గట్టించిరి. బాగుగాఁ బ్రతిష్ఠించిరి. నిరంతరాయముగా నిత్యనైవేద్యదీపారాధనాదులు నెఱపుచుండిరి. కాశినుండి లింగమును దెప్పించుటయే కాక కలకాలము నైవేద్యార్థము విపులవిలుచుటకై వేయినూటపదియాఱు లీయసంకల్పించి యిచ్చుపర్యంతము నెలకుఁ బంద్రెండో పదియాఱో రేకపల్లిభాస్కరరావుగా రిచ్చుచున్నను సత్యవాదులగు వెంకటేశ్వరావధానిగా రాచరించు దైనందిన తన్మల్లేశ్వరసేవాసత్కారముల కింకను జాలక భగవద్భక్తులగు పరులవలనఁ బంటవలంతి యార్జింపఁబడుచున్నది. దినమొకరివంతున మున్నూటఱువదిదినములు మున్నూటఱువదిమంది యిన్నిరూపాయలని యేకపర్యాయమే యిచ్చుట కేర్పాటుచేయఁబడుచున్నది. గత యువవత్సర కార్తికమాసమున నవధానులుగారు విశ్వమల్లేశ్వరునకు లక్షబిల్వదళార్చనము గావించిరి. లక్ష చేమంతిపూలచే నలంకరించిరి. లక్ష కుంకుమపూజ

చేయించిరి. సహస్రఘటాభిషేకముఁ జలుపఁ గలిగిరి. వీరి తనుమనఃప్రాణములు విశ్వమల్లేశకైంకర్యమునకే వినియోగింపఁబడుచున్నవి. ఈవిషయమై యింతచిన్న వ్యాసము చాలదు. అనుపూర్వ్యమంతయు నరసి ప్రతికొంతరమునఁ బ్రకటింపఁబడియెడిని. నిరిటి లక్షబిల్వార్చనసమయమం దెండఱో కవు లీవిషయమును వర్ణించియున్నారు. అవియు నప్పుడే ప్రకటీక్రియమాణములు.

---

## శృంగేరి.. స్వాములవారిచరిత్రి

(నాగపూడి కుప్పుస్వామయ్యగారు)

### యోగాభ్యాసము.

యోగంబున హఠయోగము రాజయోగము లయయోగము మంత్రయోగమని 4 భేదములు గలవు. లయమంత్రయోగములు రాజయోగమునం దంతర్భూతములని చెప్పఁదగు నిట్లనినచో రెండుప్రభేదములే ముఖ్యములని యేర్పడును యోగాభ్యాసముచేఁ జిత్తనిరోధమై జ్ఞానాభ్యాసమునందు యోగము పరంపరాకారణమని తెలియఁదగును. హఠరాజయోగములు రెండును జిత్తనిరోధమునకు సమానమగుసాధకములుగానున్నను హఠయోగాభ్యాసముచే నెంతవేగముగాఁ జిత్తవృత్తినిరోధము కుదురునో యంతశీఘ్రముగా రాజయోగాభ్యాసముచే నగుటలేదు ఈయర్థమును యుక్తిచేఁ దెలిసికొనవచ్చును. హఠయోగమునందుఁ బ్రాణనిరోధము ముఖ్యమైనది మనఃప్రాణముల కధిక సంబంధ ముండుటచే బలాత్కారమునఁ బ్రాణనిరోధముచేసినతోడనే చిత్తనిరోధ మొదవును రాజయోగమునందు లక్ష్యానుసంధానమే ప్రధానమైనది. లక్ష్యానుసంధానము చేయవలయు నేని చిత్తము నిశ్చలముగా నుండఁదగు. చిత్తనిరోధముసేయుటయందుఁ గొంచెమైనను నభ్యాసము చేయనియెడల రాజయోగాభ్యాసముసేయుట సులభముకాదు అందువలన హఠయోగాభ్యాసమే చిత్తనిరోధమునందు సులభమగు కారణంబని యోగశాస్త్రజ్ఞుల సిద్ధాంతము. ప్రాణాయామము పూరక కుంభక రేచకములని త్రివిధములైయుండు హృదయాకాశమునందలి వాయువును బూర్తిగా వెడలించిన పిదప మరల నాసామార్గమున వాయువును లోపలికిఁ బీల్చుట పూరకమనంబడును. అట్లు లోపలికిఁబీల్చినవాయువును నేమార్గమునను శరీరంబునుండి వెలుపటికిఁ బోనీయక నిశ్చలముగా నిలుపుట కుంభకమనంబడును. అట్లు నిలిపినగాలిని మరల నిశ్శేషముగా బయటికి విడుచుట రేచక మనంబడును ఇట్లుప్రాణాయామము నభ్యసించుచు వచ్చుటవలన నతిచంచలస్వభావముచేఁ బరువిడుచున్న మనస్సున కధికనిర్బంధము గలిగి యది చెచ్చెర స్వాధీనమగును. ప్రాణాయామసిద్ధికిఁ దొలుత స్వేదమును మధ్యమునందుఁ గంపమును నంత్యమునఁ జలనంబును గలుగునని లక్షణమును జెప్పియున్నారు అయభ్యాసమున కాహారనియమంబును నాసననియమంబును స్థలనియమంబును జెప్పియున్నారు. శాస్త్రోక్తనియమముల ననుసరించి గురూపదిష్టమార్గంబునఁ బ్రాణాయామంబును బూర్తిగా నభ్యసించినవార లతిసులభ

ముగాఁ జిత్తమును వశపఱచికొని సర్వోత్తమమగు జ్ఞానాభ్యాసమును సులభముగాఁ గావించి నిత్యసుఖము ననుభవింతురు. శ్రీస్వాములవారికిఁ బ్రాణాయామసిద్ధి చాలవఱ కొనరియుండెనని చెప్పవచ్చును. వీరు ప్రాణాయామమునకుఁ గూర్చున్న కాలంబున నధికముగా స్వేదం బొదవి శరీరమునందుఁ బాదాగ్రమునుండి శిరస్సువఱకును గంపము గలుగుచుండినదాని నీలేఖకుఁడు కన్నులారఁగాంచి తెలిసికొనియున్నాఁడు. చలనముగలుగుచుండినది యితరులకు గోచరించుచుండినదిగాదు. హఠయోగమునందు ఖేచరసిద్ధినాఁబడు కష్టతరమగు నొకభాగము గలదు. ఈసిద్ధినొందినవారికి జరామరణములు గలుగవని యోగశాస్త్రసిద్ధాంతము. దీని క్రమము ఛేదన దోహన చాలనములనెడు మూడుసంస్కారము లొనరించి నాలుకను నిడివిగాఁబెంచి లోపలి నాసారంధ్రముమార్గమున భ్రూమధ్యమునందు నాలుకను నిలుపుట. హఠయోగమును సద్గురూపదేశము నొందక యాచరింపఁదగదు. అటులాచరించినచో శరీరంబున రోగములును గొన్నిసమయములందుఁ బ్రాణహానియుఁ గలుగును. ఇది యనుభవసిద్ధము. అట్లు నాలుకను భ్రూమధ్యమునందు 3 ముహూర్తముల కాలము నిలుపుచు వచ్చినచో సహస్రారకమలమునుండి యమృతబిందుస్రావ మొదవి యమరత్వప్రాప్తి యగునని యోగశాస్త్రమునందుఁ జెప్పఁబడియున్నది. దీనికి లంబికాయోగమని ప్రసిద్ధి గలదు. ఈయోగమును శృంగేరిమఠమున నిప్పటికి 600 సంవత్సరముల క్రింద గురువులుగా నుండిన సుప్రసిద్ధులైన విద్యారణ్యస్వాములవారిగురువులగు విద్యాతీర్థులని మహాప్రఖ్యాతిగాంచిన స్వాములవా రభ్యాసముచేసి సిద్ధిఁబొందినట్లు వారిచరిత్రముచేఁ దెలియవచ్చెడు. ఇంతటి కష్టతరంబగు యోగమును గురువులవా రభ్యాసము చేయవలయునని యాలోచించుచుండఁగా నుత్తరదేశమునుండి గంగాదాసను నొక ...బైరాగి శృంగేరికి వచ్చెను. అతఁడు హఠయోగాభ్యాసముచేసి యమ్మార్గమును జక్కగా నెఱిఁగినవాఁడని స్వాములవారికిఁ దెలిసినది. బ్రాహ్మణేతరుఁడైనను నతనిని దమ సమీపమునకు రప్పించుకొని తదీయయోగ్యతను బరీక్షించి యతనియందుఁగల విశేషములం గూర్చి మిగుల సంతసించిరి. కొంతకాలము వఱ కతనిని శృంగేరియందుండునటులొడంబఱిచి ఖేచరివిషయమై యాగంగాదాసుతో విచారముచేసి యాఱునెలలకాలము క్షారలవణరహితంబగు నాహారనియమమును నడిపి ఛేదన దోహన చాలనాది సంస్కారములచే జిహ్వను బెంచి కేవలోచ్ఛ్వాసమాత్రంబుననే నాలుకను నాసారంధ్రమార్గముగ భ్రూమధ్యంబునఁ బ్రవేశించునట్లభ్యాసముచేసిరి. ఈయభ్యాసమునే ప్రబలపఱచి దానిసిద్ధిఁబడయుటకుఁ గావలసినంత యవకాశము స్వాములవారికి దొరకనిహేతువుచే భ్రూమధ్యంబునఁ బ్రవేశించిననాలుక యధికకాలమచ్చట నిలిచి ఫలకారియైనట్లు కానంబడదు. దీనివంటికష్టమైనభాగమే వజ్రోలియోగమనునది. దానిసిద్ధింబొందినవా రూర్ధ్వరేతస్కు లగుదురని యోగశాస్త్రసిద్ధాంతము. అభ్యాసకాలంబున మూత్రద్వారముమార్గమునఁ బాలును పైకిఁ దీసికొనిపోయి మరల బయటికి విడువవలయును. దీనివలనఁ దమ రేతస్సును బయటికి విడువక నిలుపఁదగిన సామర్థ్యము గలుగును. ఈయభ్యాసమునకై స్వాములవారు కొంత

కాలము ప్రయత్నము చేయుచుండినది యీ లేఖకునికి స్వయముగాఁ దెలిసినవిషయము. రాజయోగవిషయమునను విచారము చేసి యామార్గమునందును గొంతకాలము వీరు ప్రయత్నించుచుండిరి. ఈగురువులవారు యోగవిషయంబునఁ బరిశ్రమ చేసినవారే జాతివారైనను దమకుఁ గానంబడినచో వారివారి జ్ఞానము ననుసరించి యేకాంతంబున ...కొంతకాలమైనను సంభాషణము చేయకుండరు.

---

## —♦ గోమహిమ ♦—

(శ్రీనాథుని కాశీఖండము)

చం. ప్రతివసియించు గోవుల ఖురంబులయందు సమస్తతీర్థసం
తతియును. సర్వపర్వతవితానము గొమ్ములమధ్యసీమ న
ద్భుతచరితుండు శంకరుఁడు భూధరకన్యయుఁ దానుండుఁ ద
ద్వ్రతతకుచేభకుంభపరిదిగ్ధపటీరపవిత్రవక్షుఁడై. (ద్వి. ఆ. 18)

క. కొనియాడుఁ బితృగణంబులు
కొనియాడు ఋషివ్రజములు గురుసమ్మదముల్
జనియించు వేల్పులకుఁ గం
దని పెంపున నరుఁడు గోవు దానముసేయన్. 19

క. నీరాజనంబు నెఱపుదు
రారఁగ గోపుచ్ఛమున నిజాంగంబుల కె
వ్వారలు వారల యఘములు
దూరమున నడంగు. ఇండ్ల దొరకొనుఁ బ్రియముల్. 25

తే. వినుఁడు గోవులు విప్రులు వేదచయము
సతులు లోభవిహీనులు సత్యపరులు
దానశీలు రియ్యేడ్వురుఁ దాల్తు రెపుడు
అవని నెంతయు విగతభయంబుగాఁగ. 26

చం. వినుఁ.డనయంబు గోవులు పవిత్రము. గోవులు మంగళంబు. త
ద్ఘనఖురటంకశృంగపరిఘట్టదళద్ధరణీరజశ్ఛటల్
కనుగొని నవ్వుచుండుఁ బురఘస్మరమూర్ధ జటాటవీ నట
ద్ఘనపథసింధువార్లహరి గర్వభరార్భటిఁ బావనోన్నతిన్. 17

## —* హంపీ నైసర్గికమాహాత్మ్యము *—

(వారణాసి శ్రీనివాసరావు, ఎం. ఏ., గారు)

విద్యారణ్యస్వామి...మహత్తుగల స్థలమని హంపిలోఁ బట్టణము గట్టుటకు హరిహరున కాజ్ఞాపించె.. దుర్గనిర్మాణమునకుఁ గావలసిన నైసర్గికబల మాచోట నున్నది...ప్రదేశము చాలవఱ కతినిర్భేద్య పర్వతమయము...భూమి సారవంతము. ఉత్తరమునఁ బ్రవహించుచున్న తుంగభద్రానది యభేద్యపర్వతపంక్తులతోఁ గట్టని కోటగోడయై తగినసదుపాయము నేర్పఱచిన...పట్టణమునకు దాని ననుసరించుకొని బయలుదేరు పల్లెలకుఁ దగిననీటివసతి నవలీలగ నొసంగఁగలదు . లోయల కడ్డముగఁ గట్టలఁ బోయించినఁ గొన్ని వేలయెకరములు సేద్యము చేయింపఁగల తటాకము లేర్పడఁ గలవు...రాళ్ళు...లభింపఁగలవు. ...పర్వతములు బృహద్గండోపలశోభితములు...పురాణ...వానరవీరులు యుద్ధసామగ్రి పేర్చియుంచినట్లు ... పెద్దపెద్ద గుండ్లు గుట్టలువోసినట్లుండును...లోయలను జదరము చేసినఁ జక్కనివీధులకుఁ దగిన ప్రదేశములగును. గోడ(లు పెట్టి దిట్టము చేసి) లోయలలో నగరము గట్టిరి. దాదాపు 14 మైళ్ళదూరమునఁ దుంగభద్రానది కానకట్టగట్టి నీరమును బట్టణావరణములోనికిఁ దెప్పించి...వాడుకొనిరి...వీధుల నేర్పఱచిరి. ప్రతివీధికి.. దేవాలయము గట్టిరి... జనులు తమ యిష్టప్రకారము గృహముల నిర్మించి పురసౌందర్యముఁ జెడఁగొట్టుదురన్న బెగడుచే ఘంటాపథమునకు రెండువైపుల నున్నత.. ములగు గృహములఁ బ్రభుత్వమువారే నిర్మించి...ఒసంగినట్లు తోఁచుచున్నది. వెనుక నెట్లున్నను ముందఱవీధి యంతయు మందిరపంక్తులతో నొప్పారు... వీధినుండి వీధికి వీలైనచోట్ల ఘంటాపథవైశాల్యముతో బాటల నమర్చిరి. వీలుకానిచోటఁ గాలిబాటయే గతి. ఈయవస్థ ప్రదేశము కొండలతో నిండియుండుటఁబట్టి తటస్థించియుండును. వీధులకు వాని కెదురనున్న దేవాలయమందలి స్వామి...పేరిడిరి. పోనుబోను దూరమునఁ బల్లెలు వాటికలు నేర్పడెను. పట్టణమున నేవర్ణములవా రెందుండునది చెప్పుటకు సాధ్యము కాదు...మంచిదశయందున్నప్పుడు వర్ణించినవారు కొందఱున్నను విదేశీయులుకనుక వారికి మనయాచారములు తెలియకపోవుటచే నావిషయమునుగుఱించి వ్రాసినవారు కారు...మనవారెవ్వరును దానివర్ణనము చేసియుండలేదు. కాఁబట్టి దానిఁ గనుగొనుట కూహ తప్ప మఱొకసాధన మగుపించదు. హిందూధర్మరక్షణముకొఱ కేర్పడిన మహానగరమున నన్నివర్ణములు నేఁటివలెఁ గలిసి...ఉండుననుటకు వీలులేదు. శూద్రులు వృత్తుల ననుసరించి ప్రత్యేకము నివసించియుండురనుటకుఁ గొన్ని నిదర్శనములున్నవి. అప్పుడు వేశ్యకాంతలుండినవీధిని లంజలబజారను పేరుతో నేఁ డచ్యుతాలయమున కెదురుగ...చూపుచున్నారు.

శిల్పులు ... విఠలాపురమున నుండిరని పాశ్చాత్యప్రయాణికుఁ డొకఁడు చెప్పియున్నాఁడు. అటులనే మిగిలినవా రందందు నుండియుందురు. పంచములు

దూరపువాటికలలో నుండియుందురు. వైశ్యులు వర్తకమున కెం దనుకూలముగ నున్న సందెల్ల నుండియుందురు. బ్రాహ్మణులు క్షత్రియులు సుప్రసిద్ధదేవాలయములున్న వీధులలో స్నానసంధ్యాద్యనుష్ఠానములకొఱకు నదీప్రాంతములలో నుండియుందురు. ప్రజల కందఱకు...తుంగభద్రానీరము. అందందుఁ ద్రవ్విన బావులనీరము...తత్ప్రాంతములవారు నదినుండియే తెచ్చుకొనుచుండిరి. దూరస్థులైనవారికిఁ బురమున నెల్లెడల...కనుపించు కాల్వలనుండి వచ్చుచుండెను. బావులు నేఁ డెన్నియో కాన్పించుచున్నవి. ప్రతివీధిని చీఁకటిరాత్రులలో దీపములను వెలిఁగించుచుండిరి. అట్టి దీప స్తంభములు నేఁడు కొన్ని కనుపట్టుచున్నవి. రాచనగరులకుఁ బ్రత్యేకావరణముండెను. ఆయావరణములో వీధు లెట్లుండినది యేదియెట్లుండినది చెప్పుట కిప్పుడు సాధ్యముగానంత బీభత్సముగఁ దురకలు విధ్వంసము చేసియున్నారు. ఇప్పటికిని మిగిలియున్న కొన్నిటినిబట్టియుఁ బాశ్చాత్యప్రయాణికులు చేసిన వర్ణనలనుబట్టియు రాజసౌధము లతిసుందరములై యమూల్యాలంకారశోభితములై యుండియుండవలెనని చెప్పవచ్చును. ఆయావరణములో రాజులు తమకుఁ గావలసినసమస్తసదుపాయములను నేర్పఱచుకొనిరి. వారిపూజలకు దేవతాలయము లందే కలవు. ...విహారరంగములు నాట్యభవనములు నందుండెను. స్నానము చేయుటకు నీఁదులాడుటకు ననువైన తటాకములుండెను. ...రాజసభామంటపములు నాలోచనమందిరములు నందే యుండెను. రాచవారి...నిమిత్త మేర్పడిన వాహనజంతువర్గము ప్రత్యేకభవనములలో నాయావరణమునందే యుండెను. ఇఁక నాయావరణములో దాదాపు మధ్యగ మఱొకయావరణమున్నది. అది రాణివాసము ..పాశ్చాత్యుఁడొకఁడు చేసిన వర్ణనమునుబట్టి రాచవారికి వలయు వస్తుసామగ్రి సమకూర్చు విపణివీధియొకటి యా ప్రథమావరణముననుండెనాయనిపించుచున్నది. కమలాపురమునకేగు ద్వారము దాఁటఁగనే యొక చిన్న మైదానమున్నది. భీమసేనుదర్వాజా...క్రమించినంతనే యొక పెద్ద బయలు కాన్పించును. ఆ 2 మైదానములు దశరాత్రోత్సవములలో బహుళసంఖ్యాకమగు సామ్రాజ్యవరూథినీప్రదర్శనమున కనుకూలించుచుండెడివఁట. అనుదినము రాచవారి వాహ్యాళికుపయోగపడుచుండెడివఁట. నీటిసదుపాయము ముమ్మడిగ నుండినయెడల ముట్టడి జరిగినపు డది శత్రువుల చేఁబడిన...చిక్కువచ్చునను భయముచే రాచనగరులకుఁ బ్రత్యేకము...ఏర్పాటు చేసిరి...వలయు పానీయమే బావులనుండియో సేకృ చేసిన బిందెలలో ననుదినముఁ దెచ్చెడివారఁట. అదిగాక రాచనగరుల కవసరమగు జలమంతయు దక్షిణమున నున్న యొక బావినుండి సంతనచేసికొనినట్లు సూచించు నాధారములు నేఁడు కాన్పించుచున్నవి.

విద్యారణ్యస్వామి శంకుస్థాపన చేయించిననాఁడే విజయనగర మిట్లుండెనను కొనఁగూడదు. తరతరముల రాజులు తమశక్తినిబట్టియు నవసరమునుబట్టియు దానిని వృద్ధిచేయుచు వచ్చిరి. ఏరా జెంత పెంచినది చెప్పుటకు శక్యము కాదు...స్థాపించిన ముహూర్తబల మెట్టిదో కాని యప్పటినుండి నేల కొఱగువఱకు నిజధర్మమును నిర్వహించుకొనుచు మొట్టమొదటఁ గించిదైశ్వర్యముతో నొప్పి పోనుపో నపరిమితైశ్వ

ర్యముతోఁ దులఁదూఁగి విరమించినది...వ్యాపారమున కీపట్టణము ప్రధానమయ్యెను. దాని యంగడులలో నవరత్నములు గుట్టలువోసి యమ్ముఁగాఁ జూచితినని యొక పాశ్చాత్యుఁడు చెప్పియున్నాఁడు. మఱొకఁ డాపురమునకు వర్తకమునిమిత్తమై ప్రాతఃకాలమున సాయంసమయముల సరకులు తెచ్చిన బండ్ల పశువుల త్రొక్కిడిచేఁ గదల వీలులేకుండెనని చెప్పియున్నాఁడు. మఱొకఁ డిప్పటి బొంబాయికంటె నెక్కువ విలువగల వర్తక మాయూర నడచినదని చెప్పియున్నాఁడు. పట్టణైశ్వర్యము జరుగు వాణిజ్యమునుబట్టియే యుండదు. అందఱి ప్రజల సౌఖ్యమునుబట్టి కూడ నిర్ణయింపవలసియుండును...దానిని మంచిదశలోఁ జూచినవా రందఱు నందఱి ప్రజ లెటువంటికొఱఁతయు లేక సుఖించుచుండిరని చెప్పియున్నారు.. బీద సాదలు లేరనికాని దారిద్ర్యమే లేదనికాని వారిభావము...కాదు. విమర్శదృష్టితో నాఁటికి నేఁటికిఁ దారతమ్యము...విచారించినచో, నట్టిసామ్రాజ్యధాను లన్నిటిలో నాప్రజ లనుభవించిన సుఖ మింకేపట్టణవాసులు ననుభవించియుండలేదని చెప్పవలెను. అట్టిసౌఖ్యము నైశ్వర్యముఁ బ్రభువులనుబట్టియుఁ బ్రభుత్వమునుబట్టియు నుండును...

---

## — ♦ గణపతిదేవుఁడు ♦ —

(శేషాద్రి రమణకవులు)

క్రీ॥శ॥ 1199 మొ॥ 1260 వ॥ ఓరంగల్లు రాజధానిగావించుకొని యాంధ్రదేశమును బరిపాలించిన గొప్పరాజు. తిక్కనసోమయాజిముఖమున భారతము విని గౌరవించెను. ఆంధ్రకవితకు నాంధ్రశిల్పములకు నవలంబముగ నుండి యశస్సు గడించెను. ఇతనికాలమున నాంధ్రసామ్రాజ్యము విస్తృతమయ్యెను. ఆంధ్రరాజ్యముపయి మక్కువపడు మహమ్మదీయులను ముందడుగు పెట్టనీయక చోడులఁ జాళుక్యుల సామంతులఁజేసికొని చిరకాల మితఁడు ధర్మమున రాజ్యముఁ బాలించెను. మోటుపల్లివద్దనుంచి యేర్పాటులుచేసి సముద్రవ్యాపారము వృద్ధిలోనికిఁదెచ్చెను. తనపేరుతో గ్రామములు పెక్కులు నెలకొల్పి విద్వాంసులకు ధారవోసెను. పలుస్థలములలోఁ జెఱువుల నిర్మింపఁజేసెను. ఓరంగల్లులోఁ బెక్కుదేవాలయములు నెలకొల్పి స్వర్ణకుంభములను బైకెత్తించెను. అద్వైతమతాభిమానియయి జైనుల ననేకుల సంగ్రామములలో ఖండించెను. ఇతని యనంతరము కొమార్తె రుద్రమదేవి యాంధ్రసామ్రాజ్యచ్ఛత్రమును హస్తమునఁ దాల్చెను.

---

## ఖద్దరుసంస్థానము - బ్రాహ్మణ సంస్కరణము.

(పెద్దిభట్ల వీరయ్యగారు)

గుండల ఖద్దరుసంస్థానమువారు తాము చేయఁబూనిన బ్రాహ్మణసంస్కరణమును గుఱించి నాయభిప్రాయమును లిఖితముగాఁ గోరినందున దిగువసంగతులను వ్రాయుచున్నాను.

వర్ణాశ్రమతత్త్వమును గుఱించి యాంగ్లవిద్యాధికులలోఁ బెక్కండ్రకు విపరీతాభిప్రాయము లుండుట కలిమహిమ. మన మతమునకు రాజపోషణ లేనికతంబునను నిదివఱకే కొంత సంకర మేర్పడినది గనుకను సంకరము కొనసాగించు సత్పురుషులు కొందఱు మతాభిమానశూన్యులై తమ తిలక శూన్యలలాటంబులే తమ మనోలక్ష్యములకుఁ దగినమార్పులను సూచించుచుండఁ బాశ్చాత్యానుకరణము తమకుఁ బ్రధానమగుటచేత హైందవప్రాచీన సంప్రదాయముల నన్నిటిని గూఁకటివేళ్ళతోఁ బెఱికివేయ సమకట్టి పాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞులకు విస్మయముగొలుపు రహస్యము లెన్నియో మన పురాతన నాగరకతనుంచి గ్రాహ్యము లగుచుండ మనమత విధానములను ఖండాంతరవాసు లవలంబించి యనేకగ్రంథరాజములను సిద్ధపఱచి ప్రచురించుచుండ మన ధర్మములను దెలిసికొనుటకైనఁ బ్రయత్నింపక పూర్వాచారపరాయణులను జూచి హేళనఁజేయుటలోఁ గుతూహలముఁజెందుచును రాజకీయంబులందుఁ దమలోఁ దమ కొక్కటెన్నలేక యెవరికివారే యమునాతీరే యనునట్టుల విచ్చలవిడిగ సంచరించుచును రష్యనుపద్ధతులను మనదేశములోఁ జొప్పించుటకును సర్వసమత్వమును సమకూర్చుటకును వేగిరపడుచున్నారు. సర్వసమత్వమనునది ప్రకృతివిరుద్ధము. రష్యాలోసహితము కొందఱుచెప్ప చేఁతలలో నితరు లుండక తప్పుటలేదు. పైపెచ్చుగ నచ్చట నహింసకుఁ దావులేదు. అహింసాపద్ధతి ప్రాతిపదికగాఁ గలిగినవా రెటుల సర్వసమత్వమును సాధించెదరో చూడవలసియున్నది. ఇట్టిప్రయత్నమభూతపూర్వము. ఇంతకు నిది స్వరాజ్యానంతరమగు సంగతియని కొందఱనుచున్నారు. స్వరాజ్యమును సాధించుటకు వీరిలోఁ గొందఱస్పృశ్యత ముందుగా రూపుమాయవలెననువారు గలరు. పాశ్చాత్యానుకరణము వీరిని మన సాంఘికధర్మములను విడఁదీయ వీలుగలదను భ్రమలో నుంచుటకుఁ గారణమైనది. హిందువులకు మతమే పట్టుగొమ్మ. వీరి సాంఘికధర్మము లన్నియు మతములో మిళితములై యున్నవి. ఈకారణముచేతనే లోకమాన్యుని యాజమాన్యమునఁ గాంగ్రెసున్నంతకాలము నది కేవలము రాజకీయములకుఁదప్ప సాంఘికములకు వినియోగింపఁబడలేదు. గాంధీమహాత్మునితో సహాయనిరాకరణముతోపా టస్పృశ్యతానివారణము కాంగ్రెసునందుఁ బ్రవేశముగాంచినది. అందుచేతఁ బూర్వాచారపరాయణులకుఁ గాంగ్రెసునందుఁ దావు తప్పెను. మత మెప్పుడు మనుజుని గట్టుబాటులోనుంచి నియమములననుసరింపఁజేయును. నవనాగరకతకు మొదటిమెట్టు సంస్కారము. దీనికిని సంకరమునకును సమీపబంధుత్వము. ఇయ్యది మతవేషభాషల న్నిటికి వర్తించును. కట్టుబొట్టు జుట్టు ముఖ్యముగా నవనాగరకులలో సంస్కారముఁ జెందుచున్నవి. గ్రామ్యములో గ్రంథములు వ్రాయఁబడుచున్నందువలన నిఁక భాషయొక్క స్థితి యెటులుమాఱునో యెవరు చెప్పఁగలరు? మతవిషయములలో రష్యా పద్ధతి వచ్చునెడల మనదేవాలయములుఁ దురకల మసీదులు నేమగునో కదా. సామ్యవాదములందు వచ్చిన మహాత్ముని యనుచరులకుఁ బ్రభుత్వాధికారము గలుగునపు డస్పృశ్యులకు సవర్ణుల దేవాలయములు సెందఁగలవు. వీరు స్వరాజ్యమును రక్షించినను రక్షించకున్నను వర్ణసంకరముమాత్రము రాజకీయద్వారమున సాధింపఁ

గలుగుదురు. కులతత్త్వములనుబట్టి యుద్యోగములను సాధించి స్వలాభమునే చూచుకొనుచు నధికారుల నాశ్రయించి స్వరాజ్యమున కడ్డుతగులువారు కొందఱు. మతకారణముననో మితవాదకారణముననో కాంగ్రెసుతో సంబంధము కలిగించుకొనక పైశాఖకుఁ దోడ్పడువారు కొందఱు. తద్భిన్నులు కొందఱు. జాతిభేదములచే హెచ్చువరముల నాశించువారు కొందఱు. ఇంతకు నీతెగ లన్నిటిలోను వర్ణసంకరము నాశించువారు విద్యాధికులలోనే హెచ్చుగా నున్నారు. వీరికిఁ బ్రాచీనమర్యాదలు గిట్టవు. వ్యక్తిస్వాతంత్ర్యమునందలి వ్యామోహము వీరిని బట్టిలు గొట్టించుచున్నది. ప్రజాప్రభుత్వముల ననుకరించుట వీరి యాశయము. కాని పాశ్చాత్యదేశములందవి మాఱి నియంతృత్వపద్ధతి యేర్పడుచున్నది. సామ్యవాద మెక్కడికి దారితీయునో యెఱుకపడదు. పైపరిస్థితుల నొక్కసారి 5000 సంవత్సరములకుఁ బూర్వమునుంచి యున్న మన హిందూదేశమునందలి వర్ణాశ్రమధర్మపద్ధతితోఁ బోల్చిచూచిన వీరి రాక యెక్కడికో స్పష్టము కాఁగలదు.

పాశ్చాత్యరాజకీయధురంధరులు తమదేశములందలి సమ్మెలు తఱచుగా నేర్పడుటనుజూచి హిందూదేశ మయిదువేలసంవత్సరములకుఁ బైఁగా వర్ణాశ్రమతత్త్వముపై నాధారపడుటచేతనే యచ్చటి వృత్తులలోఁ బోటీలులేక వంశపరంపరాభివృద్ధిని జెంది మహోన్నతస్థితిలో నుండఁగలిగెనని వ్రాసియున్నారు. ఇప్పుడు మహాత్ముఁడును ప్రభుత్వమువారును దమ దృష్టిని గ్రామముల పైపునకు మార్చినారు. వృత్తులకు స్థైర్యము కలిగించి గ్రామస్థులకు సుఖజీవనము కలిగించుటయే వీరి యుద్దేశము. ప్రాచీనార్యుల కట్టుబాట్లను నిరసించినవారు వారిపద్ధతికే వచ్చుచుండుట విపరీతముగాఁ దోచక మానదు. పూర్వము ప్రతిగ్రామమునఁ గొన్నివృత్తులకుఁ గొందఱిని ప్రత్యేకించిరి. అందుచేతనే చాకలి మంగలి కుమ్మరి కమ్మరి మొదలగువారు వారి వృత్తులలో వికాసముఁ జెంది నిరుద్యోగసమస్యనుగాని దారిద్ర్యస్థితినిగాని యెఱుంగక కాలము గడుపుచుండిరి. ఇప్పుడో మన సంస్కర్తలు సర్వసమదృష్టిగలిగి చాకలిచేత మంగలిపని మంగలిచేఁ జాకలిపని చేయించుటకును నేఁడు కుమ్మరి రేపు కమ్మరిగా మాఱునవకాశములను గలిగించుటకును దలచేయుపనిని గాళ్ళచేతఁ జేయించుటకును బ్రయత్నించుచుండిరి. పై గ్రామవృత్తుల విభజనలోఁ గొందఱు మెదడు నుపయోగించుట కొందఱు బాహుబలము నుపయోగించుట కొందఱు క్రయవిక్రయములకును గొందఱు వ్యవసాయమునకు పెట్టుభాగస్థులుగ నేర్పడుట యనేకములగు చిల్లరవృత్తులుండుట యందుఁ గొన్ని నీచముగాఁ బరిగణింపఁదగినవై యుండుట యెల్లరకును విదితమే. ఆవిధముగఁ జూచినఁ జాకలి మంగలివృత్తులను హేయముగాఁదలంచుట గలదు. అటులనే మృతకళేబరములతో సంబంధముగలవారిని గ్రామములకుఁ గొంచెముదూరములో బ్రత్యేకించియుంచుట తటస్థించెను. ఇంతకాలమునుండి పైవృత్తులవా రవరివృత్తితో వారు సంతృప్తులై యుండిరి. స్వదేశరాజుల పరిపాలన మంతరించినపిమ్మట గత్యంతరము లేమి వృత్తులలో వ్యత్యాస మేర్పడి దానితో వర్ణాశ్రమధర్మములందు నానాఁటికి సంకర మేర్పడినది. కొందఱుసంస్కర్తలిఁక గ్రామములు పూర్వస్థితికి రాఁజాలవుకనుక వర్ణసంకరసమాప్తి యవశ్య మాచరింపఁ

దగినదై యున్నదనెదరు. సామ్యవాదులుకూడ నెవరుచేయఁగలపని వారు చేయవలసినదను మార్క్సుసిద్ధాంతము నూఁతగాఁజేసికొనుచున్నారు. నిరుద్యోగసమస్య సాధించి దేశదారిద్ర్యము తొలఁగించుటకుఁ గాంగ్రెసువారును బ్రభుత్వమువారు నవలంబించఁదలఁచినది గ్రామములందలి వృత్తులను బునరుద్ధరించుటయే యని తెలిసికొను నెడలఁ దిరిగి వర్ణాశ్రమధర్మవిధానమే క్రమమైనదని మన సంస్కర్తలకు గోచరించఁగలదు. కాఁబట్టి పూర్వాచారములనుబట్టి ప్రాఁకులాడువారి జోలికి సంఘసంస్కర్తలు పోక గ్రామ పునరుద్ధరణకై ప్రయత్నించుట ముఖ్యము నవసరము నని విన్నవించుచున్నాను. అస్పృశ్యత రూపుమాపువారే బ్రాహ్మణసంస్కరణకుఁ గడంగుట చిత్రముగానున్నది. వెనుక నొక స్త్రీ తనభర్తను వదలి పోవుచు నత్తతో నామె కొడుకుయొక్క భోజనమునుగుఱించి జాగ్రత్తగాఁ గనుగొనుచుండవలసినదిగాఁ జెప్పినట్లున్నది. ఈ నడమంతరపు సంస్కర్తలవల్లనే సంఘమున కధిక బాధ...వీరు కొంతవఱకుఁ బూర్వాచారపరాయణులతోఁ గలసి మెలసియుండి కొంతవఱకు సంస్కర్తలతోఁ జేరుచున్నారు. ప్రొద్దున మాలపల్లెలోను రాత్రి శ్రోత్రియబ్రాహ్మణుని యింటను జంకుఁ గొంకు లేక భుజించుటగలదు. మనోవాక్కాయకర్మలందు నొక్కటే విధముగ సంచరించు సంస్కర్తలవల్లఁగాని సనాతనులవల్లఁ గాని సంఘమునకుఁ జేటుగలుగదు. రెండావులదూడలవలె సత్యముమఱుఁగుపఱచి సంచరించు మేఁకవన్నె పులులనఁదగు నడమంతరమువారియెడల జాగ్రత్తతో మెలఁగవలసియున్నది. హిందువులస్పృశ్యతావిధానము నేర్పఱచి పాపము నొడిగట్టిరని పలుతావులఁ బలుమాఱు గాంధీమహాత్ముఁ డనుచుండెను. ఈసందర్భమున సంస్కర్తలలోఁ బ్రముఖుఁడగు భగవాన్దాసుగారు "తారతమ్యవివేచనలేకుండ యుక్తాయుక్తపరిజ్ఞానము లేకుండఁ బ్రతివారితోను గలసి సహపంక్తిభోజనములుచేయుటగాని వివాహసంబంధములుచేయుటగాని మంచియభ్యాసముగాని యాచారముగాని కాదు. స్మృ[illegible] శుభ్రతకొఱ కస్పృశ్యతానియమ ముద్దేశింపఁబడినది" అని వ్రాసియున్నారు. పాపము శమించుఁగాక. మఱియు భగవాన్దాసుగా..."ఒకకులవృత్తిలోఁ బ్రవేశించినవాఁ డాకులవృత్తి ననుసరించుచుమఱొకకులవృత్తి నవలంబించుటకు వీలులేదను నియమము ముండవలె"నని కూడ వ్రాసిరి. వీరే యీపూర్వపద్ధతులయొక్క...అంతరార్థములను సార్థకత్వమును మనపెద్దలు నేఁడు పూర్తిగా మఱచిపోయిరని వ్రాసియున్నారు. ప్రతిమునిసిపాలిటీలోను బాకీపనులుచేయువారున్నారు...అస్పృశ్యతానివారణకోరువారిలో నెందఱు పాకీవారితోఁ గలసిమెలసితిరుగువారును వారింట భుజించువారును గలరో కదా. ఈపాకీవారికి గ్రామముల వెలుపలనే ప్రత్యేకించి గృహములుకట్టించుట యెందులకో యెల్లరకుఁ దెలియును. ఈపనులన్నియు నవనాగరకులవల్లనే చేయించఁబడుచున్నవే. వీరందఱుఁ బాపముచేసినవారే కాఁబోలు. వీరికిఁ బ్రాయశ్చిత్తమేమిటో? భగవాన్దాసుగారే యొకచోటఁ గులభేదము లనునవి సంఘముయొక్క మేలుకొఱకై యొకసిద్ధాంతము ననుసరించి మనపూర్వులైన పెద్దలునిర్ణయించిరి కాని యీమనపెద్దలు సంఘమును జీలదీయవలెనని కాని సంఘమును భిన్నభిన్నములుగాఁ జేయవలెనని కాని యీవిభేదము కల్పించియుండలేదనియు న్యాయవృత్తుల నవలం

బించు కుటుంబములవారు ప్రత్యేకముగా నిర్ణయింపఁబడుట మంచిదనియు నొక రవలంబించిన వృత్తిలోని కింకొకరు రా నవసరములేదనియు నెవరికిఁ దగిన వృత్తి తగిన జీవనోపాయము వారికి స్థిరముగాఁ గల్పింపఁబడినదనియుఁ బూర్వులైన పెద్దలు కులభేదము లిట్లు కల్పించిరనియు వ్రాసియుండిరి. గాంధీమహాత్మునికోటిలోఁ జేరిన సంతానముగారు "సాంఘిక సమత్వ మేర్పడినను న్యూనతాధిక్యములు నుచ్చనీచభావములుఁ బరస్పరము నేర్పడుచుండును. వర్ణవిభేదములు న్యూనతాధిక్యములు సాంఘిక సమత్వపద్ధతివల్ల నశించుననుట కలలోవార్త. కులభేదములలో వ్యావహారికముగాఁ గొంత యర్థము గలదు. ఆహారాది నియమములుగలవు, అట్టినియమదీక్షలను జెడఁగొట్టుట సంఘసంస్కరణ గాదు. మతవిషయములలో సత్యాగ్రహము సార్థకము కాలేదు. రాజకీయసంబంధ ముండినఁ బ్రోద్బలముతోఁగాని ప్రత్యక్షముగనో పరోక్షముగనో ఫలవంతము కాదు" అని చెప్పియున్నారు. సాంఘికవాదమునుగుఱించి భగవాన్దాసుగారు వ్రాయుచు స్వతంత్రవాదమును సమన్వయించుటకుఁ దగిన సర్వమైన వ్యవహారపద్ధతి వర్ణవ్యవస్థయే యని తెలియఁజేసియున్నారు. పూర్వకాలమున నప్పటియవస్థలను బట్టి స్థిరమైన సాంఘికనియమ మేర్పాటుకాఁబడినటుల భగవాన్దాసుగా రంగీకరించుచుండ మహాత్ముఁడు పంచములను బ్రత్యేకించి గ్రామములకు వెలుపల నుంచి యస్పృశ్యులనుగాఁ బరిగణించుట హిందువులు ఘోరమైన పాపము చేసినటులఁజాటుచున్నారు. ఇప్పటి క్రూరమైనపద్ధతులఁదిలకించిన యెడలను బంచముల వృత్తిధర్మములను బరిశీలించినయెడలను వారిని గ్రామములనుండి ప్రత్యేకించుట సంఘక్షేమముకొఱకే యనియు నందుఁ బాప మేమియులేదనియు స్పష్టపడుచున్నది. శ్మశానవాటికలయందుఁ గలరా మశూచి మారి మొదలగు సంటురోగములవల్ల మృతులగువారి ఖనన దహనములప్పుడు సహకారులగువారును మృతజంతువుల కళేబరములతోఁ బనులు నెరవేర్చువారును గ్రామములకుఁ గొంతదూరములోఁ బ్రత్యేకించి యుంచఁబడుటయారోగ్యశాస్త్రానుగుణమగు కార్యమైయున్నది. ఇప్పుడాపంచములలోఁ గొందఱు విద్యను బడసి శుచితతో మెలఁగుచున్నంతమాత్రమున సంఘవిప్లవకరమగుపద్ధతి నవలంబించవలసినదిగా మహాత్ముఁడు కోరినను గొనసాగునది కాదు. ఆసంఘముయొక్క యాచారములు నభ్యాసములు నొక్కపెట్టున నిర్మూలమగుట యసంభవము...వంశపారంపర్యముగా నేర్పడిన నడవడి యేమగును? ...సంఘసంస్కర్తలగు హిందువులు పంచములతో నైక్యమగుటకు సిద్ధముగా నుండఁగాఁ గొందఱు హిందువు లందుకు వ్యతిరేకులని డాక్టరంబేత్కారుగారు మతాంతరుఁడగుటకును నితరపంచములను మతాంతరులఁజేయుటకును జరుపుచున్న ప్రయత్నము సరియైనది కాఁజాలదు. సనాతనులగు హిందువులకు హిందూమత సాంఘికధర్మము లభేద్యములు. వానితోఁ జెరలాటము మతములో జోక్యముకలిగించుకొనుట మతోద్రేకము హెచ్చుటకుఁ గారణముకాఁగలదు. శాంతిని గోరుమహాత్ముఁడు సంఘసంస్కరణము సంఘవిప్లవకరమగు పద్ధతుల కవకాశ మీయకుండుట ముఖ్యము. వారి శిష్యులును సనాతనులతో వివాదపడక తమ శక్తికొలఁది సంస్కరణము చేయుచుఁబంచములతోఁ గలసియుండుటకును నీఁగవలెఁ దిరిగి సనాతనులతోఁ జేరకుండుటకును బ్రయత్నిం

చుచు సత్యము నహింసను తము తోడివా రెంతవ రాచరించుచున్నారో విచారించుటకును...కోరఁబడుచున్నారు. సనాతనుల లోపములను వీరా చక్కఁబెట్టువారు!

---

## —♦ పత్రికాధర్మము ♦—

(శ్రీ. సుబ్బారాయకవిగారు)

సీ. పఠియింపవలయు సర్వాంకషంబైన సు
జ్ఞానంబు పెక్కుశాస్త్రములయందు.
ప్రచురింపవలయు నిర్వంచితంబై యొప్పు
సత్యసందేశంబు జగతియందు.
దహియింపవలయు దుస్తరక్రూరదుర్వాద
ఘోరకాంతారముల్ నేరుపలర.
చరియింపవలయు యశఃప్రపంచమునందు
సదసద్వివేకలక్షణము మెఱింగి.
పత్రికానిర్వహణకార్యభారమనఁగ
అల్పమే ? ఎల్ల రాక్రియ నల్పఁగలరె ?
చెలఁగి లోకంబులెల్ల రంజింపఁగలుగు
ఉచితరచనావిశేషంబు లోదవకున్న ?

సీ. సత్యంబుఁబ్రకటించు సమయంబులందున
తనవారు పెరవార లనఁగరాదు.
అయథార్థపువార్త లన్యు లెఱింగింప
తా నహంకారంబు పూనరాదు.
తన కనిష్టములైన తథ్యంపుసంగతుల్
మచ్చరంబునఁ గప్పిపుచ్చరాదు.
గూఢంబెయైన లోకోపకారమునకై
తా నెఱింగినవిద్య దాఁచరాదు.
సర్వసమవర్తనుండయి జ్ఞానియయి య
థార్థవాదియునై స్వార్థత్యాగియై సు
ధీరుఁడై స్వాభిమానవిదూరుఁడగుచు
అలరవలెఁ గాదె పత్రికాధ్యక్షుఁడనఁగ !

## —* దేవాలయపరివేశము *—

( గోవిందరాజు హరిశ్చంద్రరావుగారు )

శ్లో॥ విష్ఠాగర్తనిపాతేతు లక్ష మూర్ధాధికం జపేత్.
శివసంస్కారహీనైస్తు స్పృష్టే లింగే ద్విజాతిభిః 32
క్రిమా జ్జపే దఘోరస్య వృద్ధ్యైకోత్తరయా శతం.
స్పృష్టే దశసహస్రాణి నటకైవర్తకాదిభిః 33
స్పృష్టే కాకాదివర్గేణ ప్రజపే దయుతద్వయం.
అఘోరస్యాయుతైర్భాగై ర్వీక్షితే శ్వపచాదిభిః 34
స్పృష్టేతు ద్విగుణై రేభి శ్శివలింగే విశుధ్యతి.
వామదక్షిణమార్గస్థై స్పృష్టే లింగేఽయుతంజపేత్. 35
యావత్తత్సన్నిధిస్తావ చ్చలనం తన్నయుజ్యతే.
లక్షంతు స్థిర మున్మాల్య స్థాపయేచ్చ తదేవహి. 36
వ్యంగితం దగ్ధవిచ్ఛాయం సేవితం శ్వపచాదిభిః
పతితం ఘోరగర్తాదౌ హృతం రాజాదిభి ర్యదా 37
పరిత్యజే త్తదా లింగం జప్త్వా ఘోరం దశాయుతం
లింగాంతరం ప్రతిష్ఠాప్య విశుద్ధి మధిగచ్ఛతి. 38

(సోమశంభువిరచిత క్రియాకాండావళి 101, 102 పుట)

(అశుద్ధముగల కాలువయందు లింగము పడిపోయినచో నఘోరమంత్రాధిక లక్షజపము శివదీక్షారహితులైనద్విజులచే స్పృష్టమైనచో నేకోత్తరక్రవృద్ధితో మంత్ర శతజపము నటకైవర్తకాదిస్పృష్టమైన దశసహస్రజపముఁ గాకాదిస్పృష్టమైన నయుత ద్వయజపముఁ జండాలురచే వీక్షింపఁబడినయెడలఁ బంచాయుతజపమును జండాలాదులచే స్పృశింపఁబడినయెడల దానికి రెండురెట్లుజపము వామదక్షిణమార్గస్థులైన శాక్తులచే స్పృశింపఁబడిన పక్షమున నయుతజపముఁ గర్తవ్యము. ఈశ్వరసాన్నిధ్య మున్నంతవఱకుఁ జలనము యుక్తముగాదు. స్థిరలింగ మున్మీలింపఁబడినయెడల లక్ష జప మొనరించి తల్లింగమును స్వస్థానమందే స్థాపింపవలెను. వ్యంగితము దగ్ధవిచ్ఛాయము శ్వపచాదిసేవితము ఘోరగర్తాదినిపతితము రాజాద్యపహృతము నయినప్పుడు లింగ మును బరిత్యజింపవలెను. దశాయుతాఘోరమంత్రజప మొనరించి మఱియొకలింగ మును బ్రతిష్ఠించి విశుద్ధినొందనగు. మఱియు

శ్లో॥ జీర్ణాదీనాంచ లింగానా ముద్ధారవిధి రుచ్యతే
జీర్ణోద్ధారం వినా యస్మా ల్లింగం భూతాశ్రయం భవేత్.288పుట

(జీర్ణాదిలింగముల కుద్ధారవిధి చెప్పఁబడుచున్నది. జీర్ణోద్ధారము లేనిచో లింగము భూతాశ్రయమగుచున్నది.) దేవాదిప్రతిష్ఠితములైన లింగములను స్థానమునుండి కదల్పకయే సంస్కరింపవలెనని 291 వ పుటయందు వ్రాయంబడినది.

శ్లో. అసురై ర్మునిభి ర్దేవై స్తత్త్వవిద్భిః ప్రతిష్ఠితం
జీర్ణంవా ప్యథవా భగ్నం విధినాపి నచాలయేత్.

శ్లో. ఖననే చాగ్నిదాహేచ చిరలుప్తేచ పూజనే
చండాలసూతికోదక్యాశవపాతకిదూషితే
విణ్మూత్రశ్లేష్మసంస్పర్శే సంప్రోక్ష్యైవ సమర్చయేత్.
అన్యథా నిష్ఫలా పూజా మహాన్ దోషశ్చ జాయతే.

(శౌనకీయసంప్రోక్షణవిధి)

(విగ్రహము త్రవ్వఁబడియో యగ్నిచే దహింపఁబడియో యుండినను బూజ చిరకాలము విచ్ఛేదమునొందియున్నను జండాలసూతికౌరజస్వలాశవపతితదూషితమైనను విణ్మూత్రశ్లేష్మసంస్పర్శకలిగినదైను సంప్రోక్షణగావించియే యర్చింపఁదగును. అట్లు సంప్రోక్షణమొనరింపకయే చేసిన పూజ ఫలములేనిదగును. అందువలనఁ బైపెచ్చు గొప్పదోషము నుద్భవించును.)

శ్లో. దేవే స్వభక్తజనతానుజిఘృక్షయారో
పాధౌ తథా నియతసన్నిధి మాదధానే
శ్రేయో దురాసదతయా తదపాసనార్థం
స్యాచ్చే న్నిమిత్త మథ నిష్కృతి మాదధీత.

(తంత్రసముచ్చయము 2 వ సంపుటము 165 వ పుట)

దీనికి వ్యాఖ్యానమును గ్రంథకర్తయగు నారాయణపండితుని కుమారుఁడు శంకరుఁడు "స్వభక్తజనతానుజిఘృక్షయా స్వస్మిన్ భక్తస్య జనసమూహస్యానుగ్రహేచ్ఛయా ఽఽరోపితాధా ప్రతిమారూపే స్వాశ్రయే తదుక్తక్రియాభి ర్నియతసన్నిధిం నిత్యసాన్నిధ్య మాదధానే కుర్వాణే దేవే పూజకస్య శ్రేయో దురాసదతయా శ్రేయసో దుష్ప్రాపకత్వా ద్ధేతోః, గర్హితం నిమిత్తం స్యాచ్చేత్ సంభవేద్యది, అథ తదనంతరమేవ, అవిలంబితం తదపాసనార్థం తస్య దుర్నిమిత్తస్య పరిహారాయ నిష్కృతిం ప్రాయశ్చిత్తం, ఆదధీత" అని వ్రాసియున్నాఁడు

శ్లో. క్షేత్రే మృతి ర్జనన మంగణమండపాదౌ
మూత్రాసృగాదిపతనం పతితాదివేశః
సోలూకగృధ్రకరటశ్వఖరోష్ట్రకోల
క్రోష్టర్క్షడుండుభపురస్సరగర్భవేశః.

వ్యాఖ్య॥ నిమిత్తాని గణయతి క్షేత్రేతి. క్షేత్రే మర్యాదాసీమాయా మంతర్భాగే మృతి ర్జననంచ మనుష్యాణాం మరణం జననంచ, అంగణమండపాదౌ ప్రాసాదాలిందాంగణమండపబలిపీఠికాదౌ మూత్రాసృగాదిపతనం, ఆదిశబ్దేన పురీషాదికంచ పతితాదివేశః పతితా స్స్వకులా ద్భ్రష్టాః, తేషాం చండాలాదీనాంచ గోపురా దంతః ప్రవేశః సోలూక...పురస్సరశబ్దేన శ్యేనకుక్కుటాదయః, ఏతేషాం గర్భగృహ ప్రవేశః.

(స్వభక్తజనసమూహము నుద్ధరింపవలెనను కోరికచేఁ బ్రతిమారూపమైన స్వాశ్రయమందు శాస్త్రోక్తప్రతిష్ఠాబలమునఁ బరమేశ్వరుఁడు నిత్యసాన్నిధ్యముఁ జెంది యుండఁ బూజకులకు శ్రేయస్సును దుర్ఘటముగా నొనరించు గర్హితమైనకారణ మెద్దియైన సంభవించినయెడల నవిలంబితముగా నట్టి దుర్నిమిత్తములను బరిహరించుటకై ప్రాయశ్చిత్త మాచరింపవలెను. అట్టిదుర్నిమిత్తములు క్షేత్ర (మర్యాదాసీమ యంతర్భాగ)మున మనుష్యుల మరణమును జననమును జరుగుటయు నంగణమండపా (ప్రాసాదాలిందాంగణమండపబలిపీఠికా) దులందు మూత్రపురీషాసృగాదిపతనము కలుగుటయు స్వకులభ్రష్టులైన పతితులును జండాలాదులును గోపురమునుండి లోనికిఁ బ్రవేశించుటయును సులూకశ్యేనకుక్కుటాదులు గర్భగృహముఁ జొచ్చుటయు- ఇట్లు 4 విధములుగా దోషములు కలుగుచుండును. అవి కలిగినపుడు శాంతి యొనరింపవలయును. "చండాలాదు లాలయములోని ప్రతిమను స్పృశించినచో దోష మగుఁగాక, ఆలయావరణములోనికి వచ్చిన నేమిహాని" యని కొందఱాక్షేపించుచున్నారు. పరమేశ్వరునకుఁ బ్రతిమకు నాలయమునకుఁ గలసంబంధము.

శ్లో॥ ప్రాసాదోర్చ్యాచ విశ్వేశితు రిహ వపుషీ స్థూలసూక్ష్మే యతోతో
త్రాధారాధేయభావా దితరతరభవోఽన్యత్ర చాభ్యేతి దోషః
దోషేఽత్రైకస్థితేఽప్యాచరతు తదుభయో శ్శోధనం స్థానసంస్థే
తద్వత్తచ్ఛోధనాద్యం యది నపరకృతా వస్త్రోక్తా స్థలేలం.

వ్యా॥ ఇహ దోషేసతి ప్రాసాదోర్చ్యాచ విశ్వేశితుః, దేవస్య స్థూలసూక్ష్మే వపుషీ ప్రాసాదః స్థూలం వపుః ప్రతిమా సూక్ష్మం వపుః, ఇతి యతః యస్మాత్, అతోస్మాద్ధేతోః, అత్రానయో రాధారాధేయభావాత్, ప్రాసాద ఆధారః ప్రతిమా త్వాధేయమితి వ్యవస్థాపితత్వాత్, ఇతరతరభవః,తయో రేకస్మి న్నుద్భూతో దోషోఽన్యత్రచాభ్యేతి ప్రాప్నోతి. ప్రాసాదస్థో దోషః ప్రతిమాం ప్రాప్నోతి. ప్రతిమాస్థః ప్రాసాదంచ. అత్రానయో రేకస్థితేపి దోషే ప్రాసాదే ప్రతిమాయాంవాపి స్థితే దోషేపి, తదుభయోః శోధనమాచరతు. ప్రాసాదప్రతిమాభ్యా మన్యత్ర కుత్రచిత్, స్థానే స్థితో దోషశ్చే త్కింకర్తవ్యమిత్యత్రాహ స్థానసంస్థ ఇత్యాది శ్లోకశేషేణ. దోషే స్థానసంస్థేసతి తచ్ఛోధనాద్యం స్థానశోధనమాద్యం యథాభవతి తథా తద్వత్, ప్రాసాదప్రతిమయోః, శోధనమాచరతు. నయదిదోషః, స్థానసంస్థో నచేత్, స్థలే

సర్వత్ర పరకృతావస్రితోక్షా. ఇతరత్రికృతేన సంపాదితేన, అవస్రితేన, ఉక్షణమేవ. అలం పర్యాప్తం.

దేవాలయమును మూర్తియు విశ్వేశ్వరుని దేహములయి యొప్పుచున్నవి. ఆలయము స్థూలదేహమగుచున్నది. ప్రతిమ సూక్ష్మదేహము. కాఁబట్టి యీ రెండువస్తువులకు నాధారాధేయభావము. ... ఆలయ మాధారమును బ్రతిమ యాధేయము... రెండుపదార్థములలో దేనియందు దోషముద్భవించిన నయ్యది రెండవదానియందును గొల్లును. ఎట్లన నాలయమందున్న దోషము ప్రతిమకుఁబట్టును. ప్రతిమయందలిదోష మాలయమునుబొందును. కాఁబట్టి యొకచో దోష మంకురించిన రెండవదికూడ శోధింపవలెను. ప్రాసాదమునకు హానిగల్గినయెడలఁ బ్రాసాదమును విగ్రహమును సంస్కరింపవలెను. విగ్రహమునకు విపత్తుసంభవించినపుడావిగ్రహమును దాని ప్రాసాదమును సంస్కరింపవలయును. ప్రాసాదప్రతిమలకుఁ గాక మఱి యెచ్చటనో దోసము పొడసూపినయెడల నేమిసేయవలయునన దోషము గలిగినస్థానమును మొదట సంస్కరించి ప్రాసాదమును బ్రతిమను దరువాత సంస్కరింపనగు. అనఁగా స్థానప్రాసాదప్రతిమలు మూడును సంస్కరణీయములు. స్థానమునందు దోషము జనించియుండనిపక్షమున స్థానము నుద్దేశించి ప్రత్యేకముగా నొకసంస్కార మక్కఱలేదు. ప్రాసాదప్రతిమాసంస్కారకరణమున సంపాదింపఁబడిన యవస్రితము చేతనే స్థానమంతయుఁ బ్రోక్షించినచో నది సరిపోవుచున్నది, యని స్వీకరింపఁబడినది. కాఁబట్టి చండాలాదులు దేవాలయముయొక్క యావరణములోనికి వచ్చుటకూడ నిషిద్ధమగుచున్నది. గ్రంథకారుఁడు కేరళదేశమున నతిప్రఖ్యాతిగలపురుషుఁడు. ఈతఁడు ధర్మప్రవృత్తికారుఁడైన నారాయణునికంటె భిన్నుఁడు. రఘునందనభట్టాచార్యకృతమైన దేవప్రతిష్ఠాతత్త్వము 512వ పుటలో "అథాస్పృశ్యస్పర్శనేతు బోధాయనః, ద్రవ్యవత్కృతశౌచానాం దేవార్చానాం భూయః ప్రతిష్ఠాపన" మని బోధాయనవచన ముద్ధరించి "దేవార్చా దేవతాప్రతిమా, తాసామస్పృశ్యస్పృష్టానాం ప్రకృతిద్రవ్యస్యస్పృష్టానాం ప్రకృతిద్రవ్యస్య తామ్రాదేః, యథేష్టం శౌచం కృత్వా పునఃప్రతిష్ఠాపనాత్, పూజ్యత్వమిత్యర్థః" అని వ్యాఖ్యాతమైనది. దేవతార్చయన దేవతాప్రతిమ. అట్టిప్రతిమలకుఁ బ్రకృతిద్రవ్యమైన తామ్రములకెట్లో యట్టులనే యుచితమైన సంస్కారమును గావించి తిరిగి ప్రతిష్ఠించుటవలనఁ బూజ్యత్వము కలుగునని తాత్పర్యము. మఱియు నితఁడీ 512వ పుటలో

శ్లో. ఖండితే స్ఫుటితే దగ్ధే భ్రష్టే స్థానవివర్జితే
యాగహీనే పశుస్పృష్టే పతితే దుష్టభూమిషు
అన్యమంత్రార్చితే చైవ పతితస్పర్శదూషితే
దశస్వేతేషు నోచక్రు స్సన్నిధానం దివౌకసః ...

అనురత్నాకరగ్రంథమందలి యాదిపురాణవాక్యమును బ్రదర్శించియున్నాఁడు. కాఁబట్టి చండాలాదిస్పర్శవిశేషంబున దేవతాసాన్నిధ్యము పోవునని తెలియుచున్నది.

శ్రీవేంకటేశ్వరపరబ్రహ్మణే నమః

# కలిగుణప్రకాశిక

## (వెంకటేశ్వరత్రిశతి)

చ. సిరులు శుభంబు లిచ్చి ననుఁ జిన్నతనమ్మునుండి పాపపుం
తెరు వెఱుఁగంగనీక జననీజనకస్థితిఁ బ్రోచు పార్వతీ
శ్వరులఁ దలంచి మ్రొక్కులిడి ప్రార్థనసేసి గణింతు వేడుకం
తిరుపతివేంకటేశ్వర! త్వదీయమహత్త్వము లోకతత్త్వముం. 1

చ. సిరి గయికోలు పున్నెముల సీమ కళాలతికాలవాల ము
ద్ధురమహిమాస్పదంబు పరధూర్తవచోగతిబంధనాలయం
బురుగుణరత్నరాశి విభవోజ్జ్వలమంగళధామ మెన్న నో
తిరుపతివేంకటేశ్వర! త్వదీయమహోదయ మన్యలభ్యమే? 2

చ. సిరులుఁ గళల్ ప్రభావములు సిద్ధులు మేలిగొనాలు యుక్తు లా
దరములు సమ్మతుల్ పరహితక్రియ లార్జన లూర్జితంబులున్
సురుచిరకీర్తు లిన్నియుఁ ద్రిశుద్ధిగ నీయవిసుమ్మ నేఁటికిన్.
తిరుపతివేంకటేశ్వర! నుతింపఁగ నేర్తురె నిన్ను మాదృశుల్? 3

చ. సిరు లెసఁగం జపించెదఁ బ్రసిద్ధ మశేషవిశేషసిద్ధిదం
బరినికరాపభావుక మనన్యసదృక్షు మపప్రయాస మ
త్యురుసుకృతోపయాత మమృషోద్యము ముద్ధృతపాప మెప్పుడున్
తిరుపతివేంకటేశ్వర! సుధీనుత! నీయభిధానమంత్రమున్. 4

చ. పరువడి నీకు మ్రొక్కు లెదఁ బాఱఁగ నెన్నియొ మ్రొక్కుకొంటి. నీ
ఇర వెఱుఁగన్. కనన్. కని బుధేడ్యసమంచిత మూర్తివంచుఁ బ
ల్వురు వొగడంగ విందు. నినుఁ బోల రొకొం డ్లనుమాటఁ జాటుఁ
చ్చరితరసాయనంబు రుచి సారెకుఁ దిర్పతివేంకటేశ్వరా! [ద్వ

చ. సురుచిరమూర్తి నిన్నుఁ గని చూడ్కికి విందొనరించునట్టి భా
గ్యరమ వొసంగు నెప్డని యహర్నిశముం దలపోయుదున్ మదిన్.
తిరముగ నెత్తుగంపయును దింపెడుగంపయునాఁ దనర్చు సం
సరణ మదెట్లు పాల్వడుపఁజాలెదొ తిర్పతివేంకటేశ్వరా ! 6

చ. హరిహరమూర్తి వంచెఱిఁగి రార్యులు ని. న్నటు భేదవాదు లొ
ప్పరొ మతియేమొ. నా కనుభవన్నముగా దది యైక్యవాదికిన్.
గురుఁడవు దైవతంబవని కోరి భజించెద దాన నొక్కటన్
పరశివతత్త్వమా పతితపావన ! తిర్పతివేంకటేశ్వరా ! 7

చ. పరున కుపాధిభేదమునఁ బాల్పడు భేదమునాఁగనౌను. చి
త్పరతను దద్జ్ఞుఁడొక్కటిగ భావనసేయుటఁ దోఁప దద్ది. పా
పరహిత ! నీపదంబు లెదఁ బాయక నిల్పి రసజ్ఞుఁడౌఁజుమీ
పరహితకారి ! భవ్యగుణభాసుర ! తిర్పతివేంకటేశ్వరా ! 8

చ. వర మభయంబుఁ గూర్చెదవు. వారక పాణినియుక్తి శేషభూ
ధరశరణత్వమందుటయు ధన్యుల భక్తులఁ జేయఁగోరిచు.
మ్మొరు లరయంగ నేరరని యూరకపో. పతిధాష్ట్య మొప్ప సం
తరణమొనర్తు. వెవ్వరిపథం బిది తిర్పతివేంకటేశ్వరా ! 9

చ. కలిఁ గనుబ్రామి నేలికలఁ గాదన నేమగు ? లాఁతివారలే
తలఁపరు వేల్పులం చెదను. త్రిత్పతిమూర్తులవార్త లేమనన్
వలె ? విపరీతవాసనల వాకొనువారును వీరు నీదు చె
ప్పులు దలకెక్కఁ గప్పుమిడి మోయరె తిర్పతివేంకటేశ్వరా ! 10

చ. వెలయఁగ భక్తిఁగూర్తు. వవివేకము మాన్పెద వార్తిఁ బాపి. కా
సులు జమసేయఁజూతు. వరి చుట్టము లేఁడెటఁగొల్లవెట్టుచో.
వెలవెలబాటులే. దఖిలవేత్తవు. మేల్దొరలెల్ల గుత్తదా.
ర్లల నినువంటిగేస్తు గలఁడే బళి తిర్పతివేంకటేశ్వరా ! 11

చ. పిలుతురు నన్ను నిన్ బిలుచు పేరిట. నీకును నాకు భేదమే
తలఁపఁగరా. దఖండరసధర్మమునం. గవి వీవు. నేను. వె
ల్గులలొకిమీని సంజ్ఞ మెఱుఁగుంబువుపుర్వు వహించునన్న వ్య
క్తుల బలుతారతమ్య మెసఁగుంగద తిర్పతివేంకటేశ్వరా ! 12

చ. కొలుతురునిన్నుఁ బామరులుఁ గోవిదులున్ మఱిరాజరాజులున్.
తలఁపనశక్య మొండొకఁడు. దప్పను. నీయెడ విఱ్ఱవీఁగినన్
తలగొఱిగింతు. దండమిడి దాసుఁడ నేననఁ బ్రోతు. దానఁజూ
కలియుగదైవతప్రథితి గాంచితి తిర్పతివేంకటేశ్వరా ! 13

చ. కొలఁదికిమీఱు నీదు గుణకోటి. గణింపఁగ నెవ్వఁడోపు ? ఏ
తలముననుండు వేల్పు లరుదా యట మానితు లౌట ! ఎట్టిగో
డలకడనేని శోభనవిటంకము నీదగునామ మొప్పి పూ
జలఁ గొను వారి శ్రేయములఁ జాటుచుఁ దిర్పతివేంకటేశ్వరా! 14

చ. తలఁచిన నబ్బురంబొదవుఁ దావకమౌ నవధానమున్ మదిన్.
కొలఁదికిమించు కోర్కెలను గోరినవారికిఁ గోరినట్లు తె
క్కల నుడివోక కూర్చి యరకాసును వీడక కూడఁబెట్టి ని
ర్మలమతి వెచ్చగించెదవు మాయురె తిర్పతివేంకటేశ్వరా ! 15

చ. కలుషములన్ దహించునను ఖ్యాతివహించెఁ బదంబుఁ దీర్థమౌ
చిలుకును మేలిపున్నెములు సేమము లెల్లెడ వెల్లికొల్లగా.
కలుముల దీవిగాదె సతి ? కైనిడు శ్రేయము నామ: మిట్టినిన్
శరణనుభాగ్య మెంతటికిఁజాలదు తిర్పతివేంకటేశ్వరా ! 16

చ. కలి జగమెల్ల నాముకొని కాఱియవెట్టెడు. ఇట్టివేళ నీ
కలిహరనామమంత్రతరి కన్పడె నొడ్డకుఁ దార్చ. పాపవృ
త్తులు స్మరియింపఁబోరనిన దోసము వారిదిచూవె. దీప మం
ధులయెడ వ్యర్థమే నిరులఁ దోలదె తిర్పతివేంకటేశ్వరా ! 17

చ. కులమన కెవ్వరే నిడినకూడు భుజింతురు కొంద. ఆస్యభా
షలఁగల వ్రాతలన్నఁ జెవిఁజాతురు వేదము లంచొకొండ్లు. కొం
దలమునఁ బానకంబుఁగొని త్రావుచుఁ ద్రేఁపుదు రొడ్లు. పెక్కుపో
కలఁ గలివేళ నీమహిమ గ్రాలదె తిర్పతివేంకటేశ్వరా ! 18

చ. పలికినపల్కుఁ దప్పినను బాటిలు నిల్లె యధర్మమంచుఁ బ
ద్దులు జమసేయుపట్ల నొకదుడ్డును వీడవుగాక. నీకు ల
క్షలుగలవారు ప్రోవిడిన స్వర్ణశతంబును బీదలిచ్చు శ్రీ
తులసిదళంబుఁ దృప్తియెడఁ దుల్యము తిర్పతివేంకటేశ్వరా! 19

చ. తులువలు నీదు ధార్ష్ట్యమును దూఱిన దూఱఁగని. మ్రొఁకెన్నిమూ
ర్తుల కిడినావు భిక్షమును. దోఁచక యొక్కనిపొంతనుండి యొ
త్తులఁబడి తిర్పెమెత్తి ధృతిదూలఁగఁ దిండికి దివ్వెకుం జెడన్
గలిగినవారి నెందఱను గానము తిర్పతివేంకటేశ్వరా! 20

చ. కలరు యదృచ్ఛఁ బుణ్యమని కానుక లొడ్డిడఁ గాంచుసామి. లి
క్కలజగమెల్ల గెల్చి మహికాంతుల భృత్యులఁజేసి చామరం
బుల గొడుగుల్ ధరింపుఁడని పోఁడుములొప్ప నెదుర్చువారి గొం
తులు బిగఁగట్టి తెచ్చుకృతి దోఁపదు తిర్పతివేంకటేశ్వరా! 21

చ. పొలముల రాబడుల్ నగలపోఁడుము లల్లన నూరనుండు కాఁ
పులు కరణాలు లాగికొనఁ బున్నెముకై యొరులిచ్చు కాసు సం
బలముగఁ బ్రొద్దువుత్తురిటు బాపురె! కస్తురివారియింట గ
బ్బిలముల గబ్బటన్నగతి వేల్పులు తిర్పతివేంకటేశ్వరా! 22

ఉ. లేరె త్వదీయనామ మొకలీల ధరించినవార లెందఱో?
వారును నీవునుం గవులె? వచ్చునె నీదుప్రతిష్ఠ వారికిన్?
చేరువనీరువాఱి యెటొ చేరినమాత్రన పల్వలంబులున్
వారక మానసంబులనవచ్చునె తిర్పతివేంకటేశ్వరా! 23

చ. తెలియరు నీదుతత్త్వమిల. దేవుఁడ వీవ. భజింతు రొడ్లు గో
ర్కులిడుదువంచు రూకలనఁ గుల్కెదవం చపరాధశిక్షలున్
చిలుకుదువంచు నిట్లిటులె. చేసినపాపము చెప్పఁబోవు. నా
తెలివియు నింతె. ఇష్టొదవెఁ దేఁకువ తిర్పతివేంకటేశ్వరా! 24

ఉ. రామకథామృతంబనఁ దిరంబగు కావ్య మొకొండొనర్చితిన్
నేమమువీఱ నొడ్డవలె నేనుఁ దరించెదనంచు నేటికో.
సామి! భవద్గుణానుస్మృతిఁ జంపకముల్ కలితోత్పలసితిన్
దామముఁగూర్చి నీయుఱుతఁ దార్చెదఁ దిర్పతివేంకటేశ్వరా! 25

చ. సరసులుమెచ్చ సత్కృతులు చయ్యనఁ గూర్చిన వచ్చుఁ గీర్తి. ఈ
సరణినివ్రాయుపద్దెములచక్కఁ గనుంగొనరేమొయంచుఁ ద్వ
చ్చరణయుగప్రసక్తి నొకచాయకుఁదెచ్చితి. ఇన్పమొద్దులున్
పరుసముసోఁక మాఱుఁగద పైఁడిగఁ దిర్పతివేంకటేశ్వరా! 26

ఉ. వాతముపాడుగాను బలువారము లయ్యెదియే పిశాచమై
నీతనువుఁ గ్రసించి తుద నిన్ బరిమార్చెనురా కుమారక ! ఈ
యాతనయే ద్వితీయమగు నబ్దమునన్ నినుఁ బట్టె. నాఁడె యీ
జాతరమైన వింతవగ సాఁగకపోయెడిఁగా కుమారకా ! 9

ఉ. వ్యాకరణంబు నేర్చినవారల వైఖరి మాటలాడుచున్
శ్లోకముఁ బద్యమున్ మిగుల సూక్ష్మపుగం బఠియింపఁగలి సు
శ్లోకుఁడవైనవాఁడవు వసుంధర నేడవయేట కే సుతా !
ఏకరణిన్ భరింతు నిఁక నిట్టినినుం బెడఁబాసి చెప్పుమా. 10

ఉ. మూత్రపురీషముల్ బిగిసి మొత్తుకొనం బురుషోత్తమప్పడా
స్పత్రికిఁ బోదమన్న నది సైఁపక, నాయనమాఁలకన్న యా
మాత్రిన యొప్పితేంట. పలుమాఱులు నంతగఁ గల్వరించినన్
పుత్రిక ! నీకు నాకుఁ దుదిముద్దులు తీరకపోయెఁగా కటా ! 11

క. గుంటూరన్ జ్వరవార్తను వింటిని. తత్క్షణమునందె వెడలితి. అటపై
లుంటన్ వెంటనె వచ్చితి. గంటవిరామంబులోనె కడ తేఱితికా! 12

క. కొడుకా ! నీపెదనాయన కడచూపేన్ జూచుకొనఁగఁ గలిగెనుగానీ
కడునిర్భాగ్యుఁడనైనే గడె ముందుగ నరుగుదేరఁగాలేనైతిన్. 13

చ. చివరకు నీదు బొందకడఁ జేరితొ హాసుత హాసుతా యటం
చెవియొ తలంచి యేడ్చుటకు నీశుఁడు వ్రాసెనుగాని చక్కగన్
శవమును నేని చూచుకొని సంతసిలన్ లిఖియింపఁ డింకెటుల్
దివులును వీడి భూమిపయిఁ దిర్గుదురా మొగమెత్తి నాయనా! 14

సీ. తనుజ ! నీపెదతండ్రి హనుమయ్య పిల్చెనా
నకరకంటిశ్మశాన నికరమునకు ?
సుత ! నీదు మేనత్త జోగమ్మ పిలిచెనా
నకరకంటిశ్మశాన నికరమునకు ?
పుత్రి ! నామేనత్త పుల్లమ్మ పిలిచెనా
నకరకంటిశ్మశాన నికరమునకు ?
కొడుక ! నీమేనత్తకూఁతుండ్రు పిలిచిరా
నకరకంటిశ్మశాన నికరమునకు ?

ఎవ్వరేఁ బిల్వకుండిన నిటుల నీవు
పుట్టిమెట్టిన గిట్టిన భూములెల్ల
ఒల్ల కయ్యూరియందలి వల్లకాట
స్థిరనివాసంబుఁ జేసెదే వరకుమార ! 15

ఉ. నీదగు తెల్వితేటలకు నీదగు మాటల పాటవానకున్
నీదగు నింగితజ్ఞతకు నీదగు ముద్దుమొగంబురీతికిన్
నీదగు గుజ్జురూపునకు నీవయి భ్రాంతులు కానియట్టివా
రేదెస నేని యుండిరొకో యీవు చరించినచోట్లఁ బుత్రికా ! 16

చ. గునగునలాడుకొంచు రహిఁ గోటును లాగు ధరించి పొట్టిరూ
పునఁ బలకం గరాబ్జమునఁ బూనుచుఁ బ్రత్యహ మీవు స్కూలుకున్
చనియెడిపట్లఁ జూచుకొని సంతసమందెడి భాగ్య మాఱి చ
చ్చినదనుకం గృశింపఁదగు చెడ్డయభాగ్యము పట్టెఁ బుత్రికా !

ఉ. ఎందఱుచావరోయి మును నీమనయూరను మర్త్యడింభకుల్ ?
కుందకయుండలేదు పితృలోకము వారికిఁగాను. కాని యో
నందన ! నీవు చచ్చినదినంబున నూరి యశేషమానవుల్
వందురి యెంతయో సరిగ వంటకమున్ భుజియింపరైరి కా ! 18

శా. కోటున్ లాగును బూట్లనుం దొడిగి పైఁ గ్రొంబట్టుటోపీని న
త్యాటోపంబునఁ బెట్టి యొరగ సువర్ణాంభోజపత్రాకృతిన్
వాటంబౌ వదనంబు నిండఁ బెలుచన్ గంధాక్షతల్ దాల్చు నీ
ఫోటో నైనను డించుకొక చెడితిం బుత్రీ ! సదా చూచుకోన్. 20

శా. నీచొక్కాలును నీదు లాగులు మఱిన్ నీటోపి నీబూట్లునున్
నీచెప్పుల్ మఱచెంబునున్ మఱియుఁ బిస్కిసుల్ మొదల్గాఁగ నా
నీచిహ్నంబులె యింటినిండఁ గలవై నేఁగాంచినడ్లెల్ల న
న్నేఁచం జొచ్చె నెటుల్ తరింతుఁగొడుకా యీ ఘోరదుఃఖాంబుధిన్?

తే. గీ. కడుపుసొద పట్టలేక నే మిడుకుచుంటి
కాని తనుజాత ! ఎట్టులైన ఘనయశంబు
తెచ్చి తేడేండ్లకే నీవు సచ్చరిత్రి
నలరునావంగడంబున కనుగుణముగ. 22